శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# శ్రీ నీలకంఠ భాష్యము

(ఆంధ్రీకరణము - ప్రథమాధ్యాయము)

## ద్వితీయ సంపుటము




అనువాదకులు - ప్రకాశకులు

నిర్మల శంకర శాస్త్రి

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య"



శ్రౌత శివాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు
శ్రీ నీలకంఠ శివాచార్యులవారు
కాళేశ్వరము.

శ్రీ మన్నీలకంఠ భగవత్పాదులవారి యవతార సమయమును గూర్చి దిగువ విధముగా గ్రహించి శైవులు తదితర పండిత ప్రకాండులును తమ సందేహమును విడనాడుదురు గాక !

కలియుగాది ౨౦౪౪ సంవత్సరమున స్వభాను సం॥ చైత్ర శుద్ధ దశమి, సోమవారము, పుష్య నక్షత్రమున కర్కాటక లగ్నమునందు శ్రీవారి ప్రాదుర్భావము.

## జన్మలగ్న కుండలి

| | | | |
|---|---|---|---|
| కు | ర<br>బు | శ<br>శు | |
| | కర్కాటకము<br>జన్మలగ్నము | | చ<br>గు |
| | | | |
| | | | |

శ్లో॥ చతుశ్చత్వారింశ దాత్త-సహస్ర ద్వితయాత్మసు,
కలౌ వర్షేషు వృత్తేషు-స్వభాను శుభవత్సరే॥
మాసి చైత్రే వళక్షే హి-పక్షేఽథ దశమీతిథౌ,
పుష్యమ్యా మిందువారే చ-లగ్నే కర్కటకాహ్వయే॥
గురౌ కర్కటరాశిస్థే-కుజే మీనంగతేఽపిచ,
మేషే రవౌ బుధయుతే-వృషే మందయుతే కవౌ
అభినంద్య సుతం జాతం-సన్నిభం జాతవేదసా॥

గ్రంథకర్త.



RASHTRAPATI BHAVAN,
NEW DELHI-4.
राष्ट्रपति भवन,
नई दिल्ली-4

August 29, 1963.

Dear Sri Sastri,

Thank you for your letter and the book. It is a valuable piece of work, explaining the significance of the first four sutras.

With the best wishes,

Yours sincerely,

(S. Radhakrishnan)

Sri Sankar Sastri 'Nirmal'
184, Marredpalli,
Secunderabad(Andhra Pradesh).

ఏతద్భాష్యానువాదమును ఆమోదించిన పండితప్రకాండులచే
ప్రేరేపింపఁబడి రాజ రాజ పోషకులుగా
విశేష సన్మానమును గావించిన
మహోదారులు

శ్రీ యు తు లు

నరాలసత్యనారాయణ, వెంకయ్య గుప్తగార్లు,

ప్రొ ప్ర యి టర్స్

మారుతీ బీడీ కార్యాలయము,

దూదిగామ, మరియు నిర్మల.

ఆం ధ్ర ప్ర దే శ్.

శ్రీ గణేశాయ నమః

శ్రీ శివాయ గురవే నమః

# పండితాభిప్రాయములు

బ్ర॥ కె. వి. సుబ్రహ్మణ్యమ్
ప్రిన్సిపాల్
మున్నాలాల్ సంస్కృత కళాశాల,
లాలాగుడి, సికింద్రాబాద్, ఆం. ప్ర.

3-2-1967
శుక్రవారము.

పంచ పద్య పుష్పోపహారః

శ్లో॥ ఆచార్యస్య శివేతరక్షతిపటోః శ్రీ నీలకంఠ ప్రభోః,
భాష్యం విశ్వజనేషు భక్తిజనకం కర్తుం వ్యవస్యన్ ద్విజః ।
ఆంధ్ర్యా దైశికభాషయా సరళయా పూర్ణానువాదం వ్యధాత్,
బ్రహ్మశ్రీ పరిశోభితో విజయతే శ్రీ శంకరః పుణ్యదః॥ ౧

శ్లో॥ లోకే విశ్రుత నామ యస్య సుజనాః శృణ్వంతి రోమాంచితాః,
చేతో యస్య సదా స్మరత్యనుకలం శ్రీరుద్రపంచాక్షరీమ్ ।
అంబయ్యాఖ్య మహానుభావ గరిమా సంకల్పసిద్ధస్య భో,
తస్య ప్రేమపదానుజోఽద్య తనుతే శ్రీ నీలకంఠప్రథామ్॥ ౨

శ్లో॥ వ్యాసప్రోక్త మహావిభూతి లసిత శ్రీ బ్రహ్మసూత్రాణ్యహో,
భాష్యైర్భాంతి మహోజ్జ్వలై ర్దశయుతైః సంఖ్యాత్రిభి ర్భారతే ।
తత్ర శ్రీ శివపారమేశ్వర మహాభూతి ప్రసిద్ధం శుభం,
భాష్యం సార్వజనీన మద్య దయయా శ్రీశంకరాఖ్యో వ్యధాత్॥ ౩

శ్లో॥ శ్రియః సంస్కృతభాషాయాః-దధతం భాష్యపోషణం,
శంకరార్యకృతం గ్రంథం-పూజయంత్వితి సజ్జనాన్॥ ౪

శ్లో॥ ప్రార్థయన్ భగవంతం చ-ప్రార్థయే మనసా శివమ్,
భాష్యానువాద గ్రంథస్య-తత్కర్తుశ్చ శ్రియై భువః॥ ౫

బి. ఓ. యల్. సంస్కృత కళా సముత్తీర్ణౌ
నిర్మల నీలకంఠ రామనాథ సోదరౌ
184 మారేడు పల్లి, సికింద్రాబాదు.

పరాభవ నం॥ మార్గశీర్ష కృ॥పంచమి
రవివాసరః

శ్లో॥ భవానీశంకరౌ వందే - శ్రద్ధా విశ్వాస రూపిణౌ।
యాభ్యాం వినా నపశ్యంతి - హృదయస్థౌ పరాత్పరౌ॥
అయి భోః శాంభవదీక్షితాః విపశ్చితః !

తత్రభవతాం విదితచరమేవ; యత్ విశిష్టాద్వైత శైవసిద్ధాంతం ప్రతిపాదయతి సుష్ఠు నీలకంఠీయం సూత్రభాష్యమ్;

శ్రీ శివయోగినః మహోపాధ్యాయ బిరుదాంకితాః ముదిగొండ నాగలింగశాస్త్రి ఆరాధ్యవర్యాః భాష్యస్యైతస్య శివచింతామణి సమాఖ్యాం వ్యాఖ్యాం విరచ్య శివాద్వైత స్వరూపం శైవానాం జిజ్ఞాసూనాం వ్యుత్పన్నహృదయానాం సమ్యక్ జ్ఞాపయామాసుః;

తత్రాపి తత్ గైర్వాణీ పరిజ్ఞాన ప్రాచుర్యవతామేవ సుగమమితి మత్వా శైవాగ్రగణ్యా సంప్రేరితాః ఆంధ్రజిజ్ఞాసూనా ముపకృతయే అస్మత్పితృవ్యచరణాః శ్రీ నిర్మల శంకరశాస్త్రిణః ఆంధ్రభాషాయాం మనోజ్ఞం నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యస్యాను వాదం సముల్లిఖ్య చతుః సూత్రీపర్యంతం ప్రథమభాగతయా ప్రకటయామాసుః,

అపిచ

సంప్రతి ప్రథమాధ్యాయాంత పర్యంతం ద్వితీయభాగత్వేన వ్యయప్రయాస క్లేశం సహంతః ప్రకటీకుర్వంతి॥ ఇత్థ మయంగ్రంథః అస్మాదృశానాం గైర్వాణీ ప్రణయినాం ఆంధ్రజననీ స్తనంధయానాం దుర్జ్ఞేయ స్వమత సిద్ధాంత పరిజ్ఞానం వితన్వన్ ముముక్షూణాం సర్వేషాం అవశ్యపఠనీయః ఆచంద్రతారార్కం విరాజతా మిత్యాశాస్మహే॥

---

మహేశ్వర మాహేశ్వరీ
సేవాపరాయణుఁడు,
శ్రీ ముదిగొండ ముక్తిలింగశాస్త్రి.

బందరు
బుట్టాయిపేట
4-7-1961

శ్రీ లోకారాధ్యులైన మల్లికార్జున పండితారాధ్యుల నిర్మల శంకరశాస్త్రిగారి పాదపద్మముల సన్నిధికి:

ముదిగొండ ముక్తిలింగశాస్త్రి అనేక శరణులు సమర్పించి చేయు విజ్ఞాపనము:

మాహేశ్వర ప్రవరా !

తాము రచించిన నీలకంఠభాష్యానువాదములో మొదటిభాగమును సాంతముగ చదివినాను. సంస్కృతభాషయందే గాక ఆంధ్రమునందు గూడ అపారమైన పరిశ్రమను చేసినట్లు తమ యనువాద గ్రంథమే చెప్పక చెప్పుచున్నది. తమ గ్రంథము మాదృశులకు కొంగుబంగారమువంటిది. ఈ గ్రంథమును చదివిన తరువాతనే సంస్కృతభాష్యములో గల దుర్జ్ఞేయవిషయములన్ని యవగతము లగుచున్నవి. సంస్కృతము రాని యాంధ్రులకు మీ యనువాదము నేత్రమనుటకు సందియములేదు. ఇదేవిధము భాష్యము నంతయు శీఘ్రకాలములో ననువదించినయెడల మీ యశస్సు భూమండలమున సర్వత్ర వ్యాపించుట ధ్రువము. మీ ప్రతిభ గురించి "జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెంబేలా?" అన్నట్లు సర్వులకు తెలిసియే యున్నది గాన నేను ప్రత్యేకముగా వచింప నవసరముండదు.

ఇతి సర్వం శివమ్.

---

బ్ర॥ ముదిగొండ ఆంగీరసశర్మ
తెలుగు పండితులు
ప్రభుత్వ మాధ్యమికోన్నత పాఠశాల, సంగారెడ్డి

పరాభవ సం॥
పౌష కృ॥ ఏకాదశి.
5-2-1967

తరతరాల భారతీయ చరిత్ర పుటలలో శైవమత ప్రాబల్య ప్రాభవములు జగద్విఖ్యాతములుగా విలసిల్లినవి. పరమాత్మ స్వరూప స్వభావాదులను ఋషులు వేదయుక్తి అనుభవాత్మక విద్యతో సమన్వయముఁజేసి భారతీయ తత్త్వశాస్త్ర సౌధమునకు ఉన్నత శిఖరము నేర్పరచినారు.

అట్టివారిలో శ్రీ నీలకంఠ శివాచార్యు లొకరు; వారి మేధాసంపత్తికి మూలమే శ్రీ నీలకంఠభాష్యము; అట్టి మహాభాష్యమును తెనిగించి తెనుగుప్రజకు శైవమత మౌలిక సిద్ధాంతమును దెలుపవలయునను సదాకాంక్షయే ప్రస్తుత యనువాద మహోద్యమము.

అద్యతన సంస్కృతాంధ్ర నిష్ణాతులలో వగ్రశ్రేణికిచెందిన శాస్త్రిగారి వైదుష్య మహా ప్రతిభా వ్యుత్పత్తులను నే బేర్కొనుట జగమెరిగిన బ్రాహ్మణునకు జందె మన్నయట్లుండును.

ఇఁక ప్రస్తుతము ఈ యనువాదము శైవవాఙ్మయోద్యానవనమున వికసించిన కుసుమగుచ్ఛము. తెలినీటి తేటవాఁకవలె సాగిన వీరి యనువాదసరణి గ్రాంధికులను పామరులను మెప్పింప గలిగినట్లు యున్నదనుటలో విసుమంతయు యతిశయోక్తి లేదు.

శైవమత సిద్ధాంతములను యందలి విశిష్టతను దెలిసికొనుటకు శ్రీ శాస్త్రిగారిచే చేయఁబడిన యీ ప్రయత్నము సంపూర్ణాంధ్ర ప్రజానీక గౌరవాదరణములను పొంద వలయునవి, శ్రీవారింకను శివపారమ్యమునఁ జాటు రచనా వ్యాపారమును నిర్విఘ్న ముగా కొనసాగించవలయునవి ఆ శివమూర్తిని ప్రార్థించుచున్నాను.

నాయందలి ప్రేమాభిమానములచే యీ యవకాశము నిచ్చిన శ్రీ శాస్త్రిగారికి యెంతయో కృతజ్ఞుడను.

విధేయుఁడు : ఆంగీరస

---

## శ్రీ అంబారిపేట విశ్వనాథారాధ్యులవారి ధర్మపత్ని, శ్రీమతి కామాక్షీదేవి, లచ్చుపేట, మెదక్ జిల్లా.

బ్రహ్మశ్రీ లోకారాధ్యులైన శ్రీ కంఠ విద్యాభూషణ, సంస్కృత సాహిత్య రత్న, పండిత, నిర్మల శంకరశాస్త్రిగారు తెనుగించిన నీలకంఠ భాష్యమును నా భర్త గారు చదువగా విని సంతసించితిని. ఇద్దానిని నావలె ఆంధ్రమహిళలు చదివి వినియు సంపూర్ణ ఆంధ్ర భాష్యమును తెలుసుకొనుటకు కుతూహల పడుదురుగాత!

"దీపమున్నపుడే ఇల్లు చక్కపెట్టుకొనవలె" నను సామెత ననుసరించి దేహములో జీవాత్మ యున్నపుడే శారీరక బ్రహ్మమీమాంసా సూత్రముల సారమును గురు తెలఁగి తమ యజ్ఞానమును పోగొట్టుకొనవలసి యుండును. సతికి పతిభక్తి ముఖ్యమై నట్లు ముముక్షువుల కియ్యది బాహ్యాభ్యంతరశుద్ధిని కలుగజేసి శాంభవ దీక్షాసాఫల్యము నొనఁగూర్చునది. మరియు స్వల్పజ్ఞానవతులైన నాబోటి సోదరీమణులకు కరదీపిక వంటిది.

శ్రీ శాస్త్రిగారి ఆంధ్రీకరణము సర్వశాస్త్ర సమ్మతమై శ్రీ కంఠమణిప్రభా మయూఖమను పేరుతో విరాజిల్లుచు శివాద్వైత సిద్ధాంతమును శైవ సంప్రదాయమును విశదీకరించుటలో నసమానమైనదని మహాప్రాజ్ఞేశ్వరుని సమ్మతితో నా యాశయము నిట్లు బయలు పఱచితిని.

వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి,
తెలుఁగు పండితుడు.

భీమవరము,
పశ్చిమ గోదావరి జిల్లా
తేదీ 8-12-61

C/o శ్రీ మానేపల్లి సూర్యమాణిక్యంగారు, భీమవరం

## ఆస్తిక మహాశయుల కొక మనవి

పురుషార్థములు నాలుగు. ధర్మ, అర్థ, కామ, మోక్షములు: అందు మోక్షము పరమ ప్రయోజనము. అందులకు సాధనములు శ్రవణ మనన నిధి ధ్యాసములు. వానిలో ప్రథమము శ్రవణము. శ్రవణమనగా గురువులకడ వినుట. ఏమి వినవలె ననగా ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భాష్యము. ఈ బ్రహ్మసూత్రములకు నీలకంఠాచార్య శివయోగీంద్రులు, శంకరాచార్యులు రామానుజాచార్యులు మధ్వాచార్యులను వారలు భాష్యములను వ్రాసిరి. భాష్యములయందు వారివారి మతములను ఆచార్యుల వారలు వ్యక్తము చేసి యున్నారు. వానిలో నీలకంఠాచార్య శివయోగీంద్రులవారిచే వ్రాయబడిన భాష్యము నీలకంఠభాష్యము. అందు శైవమతము చక్కగా ప్రకటింపబడెను. నీలకంఠభాష్యమును బ్రహ్మశ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు తెనుఁగు బాస ననువదించిరి. నేను నీలకంఠభాష్యము అనువాదమును చూచితిని. పఠించితిని. శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారి యనువాదము నాలుగు సూత్రములు మాత్రమే చదువుటకు లభించెను. మతములు భేదముగానున్నను గమ్య స్థాన మొక్కటియే. శ్రీ శంకరశాస్త్రిగారి యనువాదముమధురము ఆదరణీయమనుటలో సందేహము లేదు. ఇతర మతముల వారలు గూడ చదువుటలో దోషము లేదు. సర్వమతములును సమాదరణీయములు. స్వమతమును మాత్రము వీడరాదు. శ్రీ శంకరశాస్త్రిగారి నీలకంఠభాష్యానువాదములో నీలకంఠభాష్యము చక్కగా ప్రతిఫలించినది. కొన్ని స్థలములలో వారి మతమును సులభముగా ప్రతిపాదించిరి. కావున సమాదరణీయము, పాఠ్యము. ఇట్లు నీలకంఠ భాష్యము నంతటి ననువదించి ప్రకటించెదరు గాక యని భగవానుని ప్రార్థించుచున్నాను.

# శ్రీ నీలకంఠ భాష్యము

వేదవ్యాసరచిత బ్రహ్మసూత్రములకు శ్రీ నీలకంఠాచార్యులవారు రచించిన భాష్యంలో చతుస్సూత్రికి (మొదటి నాలుగు సూత్రాలకు) ఇది తెలుగు అనువాదము. లోగడ మదిగొండ నాగలింగశాస్త్రిగారు నీలకంఠభాష్యం మీద "శివచింతామణిప్రభ" అనే సంస్కృత వ్యాఖ్యానం రచించి భాష్యార్థాన్ని సుగమం చేశారు. అది అందరికీ అందుబాటులో లేదని యీ తెలుగు అనువాదానికి ఈ గ్రంథకర్త పూనుకొన్నారు. పెక్కురు పండితులు వీరి అనువాదరీతిని మెచ్చుకొన్నారు. శ్రీ నాగలింగారాధ్యకృత దక్షిణామూర్తిస్తోత్రము ఆంధ్రతాత్పర్యంతో నిందు సంకలితం అయింది. శ్రీ నీల కంఠాచార్యులవారు శ్రీ శంకర భగవత్పూజ్య పాదులకంటె ప్రాచీనులనుటకు కొన్ని యుక్తులు వీరు చూపినారు. అది విశేష విమర్శ విషయం.

సూక్ష్మచిదచిద్విశిష్టుడగు కారణరూపశివుడు స్థూల చిదచిద్విశిష్టుడైన కార్యరూప (ప్రపంచరూప) శివుడు ఒక్కడేయని శివాద్వైత సిద్ధాంతము, నారాయణ (విష్ణు) నామ వినిమయమాత్ర భేదంగా వైష్ణవ సిద్ధాంతం ఇంతే. కార్యరూపమైన విశ్వం కేవలం మాయాకల్పితం మిథ్య. కార్య సాపేక్షంగా కల్పితమైన కారణత్వమే కాని వస్తుతః పరమాత్మయందు కారణత్వంకూడా లేదని శంకరాద్వైతం నిరూపిస్తుంది. పరస్పర విభిన్నములైన యీ ప్రస్థానాలు మూడింటికీ వేదములే ఆధారంగా ఉన్నాయి కాన యివి ఆస్తిక మతములుగా ఉపాదేయములై వున్నాయి.

ఎటొచ్చీ శివశబ్దమే బ్రహ్మపరం అని శైవులు, నారాయణ శబ్దమే బ్రహ్మ పరం అని వైష్ణవులు అన్వయించి వ్యాఖ్యానించుకొన్నారు. అది అశబ్దం అన్నారు శంకరులు, ఆ స్థాయిని అందుకోడానికి ముందు ఉపాసన భక్తిస్థాయిలో శైవ వైష్ణవ ప్రస్థానాలు అందరికీ ఉపాదేయాలే. నాయనార్ల, ఆళ్వార్ల స్తోత్ర గ్రంథాలలో ఉన్న భక్తిరస మధుర సారస్వతం అంతా సర్వులకు ఆస్వాద్యం. అలాగే ఆయా శైవ వైష్ణవ సిద్ధాంత రీతులుకూడా అందరూ అవగాహనచేసికోవడం చాలా అవసరం. అది దోషమేమీ కాదు. ఆ దృష్టితో తేటతెనుగులో చక్కగా వివరింపబడిన యీ గ్రంథాన్ని అందరూ చదువవలసిందే శాస్త్ర మర్యాదలతోడి యీ గ్రంథం తెనిగింపు కూడ సులభంగానే ఉన్నది. ప్రశ్నోత్తర రూపంగా శాస్త్ర వాదోపవాదాలుకూడ తేలిక భాషలో వ్రాయుట విశేషమే.

ఆంధ్రప్రభ,
28-2-1967

—దీక్షితులు

# -: ఆంధ్ర నీలకంఠీయము :-

శ్రీ నీలకంఠభాష్యము
తా నొక భాష్యంబ యగుటఁ దత్ప్రవచన మాం
ధ్రానీక హృదయగోచర
మౌనట్లా లేఖ్య రుచిర మౌకృతి వెలసెన్॥
భాష్య ఫక్కికఁ బాయని భాషలోనఁ
బరువులెత్తిన నిర్మలపండితేంద్ర
శంకరారాధ్యలేఖిని శాంకరియయి
తత్త్వవేదిక లాస్య నృత్యమ్ముఁ జూపు.
ధన్య మీ యాంధ్రలోకమ్ము తరుణచంద్ర
శేఖరాద్వైత సిద్ధాంత శేవధియయి
నీలకంఠీయ మాంధ్రాన నిరుపమాన
సరణి వెలయింప మీరలు శంకరార్య.

మూలంపల్లి
చంద్రశేఖర శర్మ,
25-1-1967.

# दो बातें

मैंने श्री निर्मल शंकर शास्त्री जी का रचा हुआ श्री नीलकण्ठ भाष्य का आन्ध्रानुवाद अत्यन्त संयम एवं आसक्ति से पढ़ा है। यह ग्रन्थ 'चिन्तामणि प्रभा' नामक टीका के अनुसार रचा हुआ है। इसकी भाषा और शैली सरल तथा सुबोध है।

दर्शन-शास्त्र की कठिन समस्याओं का परिष्कार करने तथा भिन्न-भिन्न वादों का समन्वय करने के स्थलों में अनुवादक ने भाव की अभिव्यक्ति के लिए जो भाषा और शैली अपनायी है, सचमुच प्रशंसनीय है। यद्यपि इस 'चतुस्सूत्री' में शिवाद्वैत का ही प्रतिपादन किया गया है, तथापि वैष्णव धर्म और द्वैत का विरोध थोड़े ही मिलता है। अनुवादक ने वेदान्त को सर्व-सम्मत बनाने का भरसक प्रयत्न किया है। प्रज्ञातीत वस्तु का संप्रदर्शन इतनी सुगमता से विरले ही प्राप्त हो सकता है।

मेरी राय में यह ग्रन्थ हर एक हिन्दू धर्मावलंबी को अवश्य पढ़ने और मनन करने योग्य है।

तेनाली }
16–11–60 }

मुदिगोंड विश्वनाथ शास्त्री,

CHAGANTY SANKARASASTRY, M.A., B.L. Phone: 34897
Senior Advocate, Secretary
Sri Saiva Mahapeetham
3-4-866, Barkatpura,
Hyderabad-27 (A.P.)
Date.: 12-2-1967.

Appreciation of Neelakantha Bhasyam Translation

Author: Sri Lokaradhya Nirmala Sankarasastry

The author, Sri Lokaradhya Nirmala Sankarasastry, who belongs to an orthodox Aradhya Family of true piety and devotion to Parama Siva, a family which traces its descent from Sri Mallikharjuna Panditha, one of the Twelve distinguished Aradhyas of the Andhra Desa held in sublime reverence, is an erudite Sanskrit Scholar with profound proficiency in Saivaite Cult and religious lore. Sri Nilakantha-Acharya, himself one of the Historic Twelve Aradhyas is a superb exponent of Siva-Advitha Philosophy and Saivism, seated on a throne of unsurpassed fame, and adoration. His commentary on the Holy Sage Vyasa's Brahma Suthras, the renowned Nilakantha Bhasyam which unfolds and upholds the Supremacy of the said Philosophy or Sidhanta and religion, is a treatise of highest authority, commanding high respect and reputation in the realm of religion, and is sovereign where it reigns. His interpretations and Siddhanthas are indeed recognised by the Saivaites as the only correct ones. Sri Lokaradhya Nirmala Sankarasastry has rendered unique service by his able and impressive translation of Sri Nilakantha's Brahma Sutra Bhasyam into Telugu, making the Divine Knowledge embodied therein accessible to all the Telugu-knowing people, and also enriching the religious literature in general thereby. The first part of his work was published previously, and won wide approval and appreciation. This second part is now ready, and I hope that the public will receive it with equal acclamation deriving therefrom the valuable enlightenment which it is certain to impart to whoever will endeavour to obtain it and avail himself of its spiritual treasures.

The public at large, inclusive of those who belong to different schools of thought, philosophy and religious practices, will without any detriment to or disparagement of their own cherished firm faith in them, have an insight into the intrinsic excellence of the great Saivaite doctrine, by a dispassionate study of these works. Since the testimony of disinterested thinkers of western culture invariably commands more respect and inspires belief in modern Times, and it will not be treated or under estimated as partisan, partial or blind, it may be advantageous to extract in this context a few such opinions as samples. "The philosophy (Saiva Sidhanta) offers an excellent example of a total philosophy. Both by definition and development the *Saiva Siddhantha philosophy claims to be the acme of religious thought*". (John H. Piet P H D.) "The Saiva Siddhantha System is the most elaborate, influential and undoubtedly *the most intrinsically valuable of all the religions of India*". (Dr. G U. Pope 19th Century).

Members of the Saiva Community in particular will do well to bear in mind that in the words of Rev. Goodle "This system of *Saiva Siddhanta* possesses the merit *of great antiquity*——. As a system of religious thought, as an expression of faith and life, *Saiva Siddhanta is by far the* best judged by its intrinsic merits *the Siddhantha represents the high water-mark of Indian Thought and Indian Feeling*". Such of them among us, who have the capacity to do so, therefore owe it to themselves and to the hoary community to which they belong, to examine this so highly admired Siddanta independently, be convinced of its infalibility and ardently practice as well as propagate the religion and the philosophy by making such contributions, as is done by our distinguished author Sri Lokaradhya Nirmala Sankarasastry and by his example, or as best as possible otherwise. Such of them among us, who have not such capacity, owe it to their progeny, and are hereby exhorted, to implicitly respect their wise ancestors whose unswerving spirituality and spiritual fervour are their safest guide and anchor at all times, and to transmit to that progeny the noble herdity and tradition which those ancestors transmitted to themselves, by following and fostering that ancestral religion and philosophy, giving no room for its slightest disregard discard or desertion. It is essential for us to remember that what is one's own is always more conducive to happiness and harmony, than any other one, borrowed

from outside and external. In an illustrious article on research in Ayurveda written recently, a great scholar practitioner of Ayurveda of high ability and ardour for that ancient Science, Pandit Sri Srirangam Subbarao Doctor of Ayurveda brought to light an interesting eternal truth enunciated by our Divinely inspired Rishis. He wrote that it is embodied in Chatka's Cri·p dictum that

యస్మిన్ దేశేహియోజాతః
త్యస తజ్జౌషధమ్ హితమ్.

*whoever is born in a particular country, to him the drug grown in his Native Soil is suitable".* If drugs of one's Mother Earth are so efficacious in mending and weeding out bodily ills, religious faith, precept and practice, inhered from and nourished on the sacred soil of one's own mother pedigree, heredity and tradition, must undoubtedly be more efficacious and exclusively potential to eradicate all the accumalated spiritual ailments or sins, and confer the blessing of spiritual bliss of far greater moment on every such individual, and sect.

Turning once again to our learned Author Sri Lokaradhya Sankarasastry, no encemiumbestowed on, or encouragement extended to him will be an adequate acknowledgement of the deep debt of gratitude due to him for his valuable spiritual contributions. Finding none else better, I blend both my palms to offer my Pranamams to him in humble recognition of his scholarship and service (to the Saiva Community as well as the wider humanity). That scholarship and service are both of high order for which these two parts of translation of Nilakantha Bhasyam and his other similar works of eternal worth and everlasting vitality will be self evident elequent proofs.

SIVAYA NAMAHA.

CHAGANTY SANKARASASTRY
Advocate, Secretary
Saiva Maha Peetham
12-2-1967.

## శిష్టాః సర్వే శివం ప్రపన్నాః



బ్రహ్మశ్రీ॥ లో॥ మూలంపల్లి శివలింగారాధ్యులవారు

తత్సతీమణి చండికాంబగారు

నివాసము - లచ్చుపేట, మెదక్‌జిల్లా, (ఆం. ప్ర.)

శ్లో॥ మూలంపల్ల్యబ్ధి సంభూతాన్ - సాంబయారాధ్యసంభవాన్,
నాగాంబాగర్భముక్తాభాన్ - శివలింగాఖ్యయోగినః ।
గణార్చనరతాన్ వందే - శ్రౌతశైవ గురూ నహమ్॥

లచ్చుపేటయందు పూర్వము బ్ర॥ మూలంపల్లి సాంబయారాధ్యులవారు అఖండ తపః సంపన్నులై నిరంతర మాహేశ్వరాన్నదానమును షట్కాల శివపూజనమును చేయుచుండెడివారు.

ప్రతివత్సరము మహాశివరాత్రిని రుద్రస్వాహాకారములను సూర్య (శూన్య) సింహాసనముపై గురుచరేశ్వరారాధనమును తమ జీవితాంతము వరకు గావించిన శివయోగనిష్ఠా గరిష్ఠులు;

శ్రీవారి జ్యేష్ఠపుత్రులు మన శివలింగారాధ్యులవారు. వీరును జనకునివలె నిత్యసత్త్వవ్రతము శివపంచాక్షరీజపము మొదలగు కఠిన నియమములతో శివప్రీతికి పాత్రులగుచున్నవారు. మఱియు ప్రతివత్సరము మాఘ బహుళమున శైవగణార్చనఁ జేయుచు అప్రతిమ కీర్తి నార్జించినవారు. ఉదారహృదయులున్ను;

వీరి యనుజాని పత్ని యగు భ్రమరాంబగారు సరళహృదయురాలు, వీరి జ్యేష్ఠపుత్రుఁడు బ్ర॥ రాజమల్లయ్యగారు, ఇఁక కనిష్ఠపుత్రుఁడు - బ్ర॥ రాజశేఖరశాస్త్రి అనువారు; న్యాయము వేదాంతము ఆయుర్వేదము ఇత్యాది విద్యలలో నిష్ణాతులగు శ్రీ శాస్త్రిగారు విజయవాడ, వరంగల్లు మొదలగు చోట్ల విద్వత్సభలయందు భాష్య ప్రవచనాదుల నొనర్చి పండిత ప్రకాండులను నిరుత్తరులఁ జేయుటయే గాక ముగ్ధులఁ గావించిన ప్రతిభతో విరాజిల్లువారు.

ఏతాదృశగుణగణములతో అపూర్వ ప్రభావముతోడను శ్రీ శివలింగారాధ్యుల వారి కుటుంబము ఆచంద్రతారార్కము విలసిల్లుగాత యనియు శ్రీ ఆరాధ్యులవారు ఈ ముద్రణకు విశేష సాహాయ్యము నొనర్చిరనియు తెలుపుటకు సంతసించుచున్నాను.

గ్రంథకర్త.



శ్రీ గురుమూర్తి, విద్వాన్, కామర్సు **చంద్రమౌళిశాస్త్రి** ఆరాధ్యులవారు,
మరియు వారి ధర్మపత్ని, విదుషీమణి, కామర్సు **కమలాదేవి,**
నిజాంసాగర్, ఆంధ్రప్రదేశ్.



**श्री कामर्सु, चंद्रमौळि शास्त्री महाराज,**
**सौ. कमलादेवी, निजांसागर.**



సౌభాగ్యవతి కామర్సు కమలాదేవి.

( బ్ర॥ కామర్సు చంద్రమౌళి శాస్త్రిగారి ధర్మపత్ని )

మహారాజ పోషకులు

బ్రహ్మశ్రీ లోకారాధ్యులైన విద్వాన్,

కామర్సు చంద్రమౌళి శాస్త్రిగారు, లచ్చుపేట, మెదక్ జిల్లా.

సంస్కృత సాహిత్యమునందు, ఆయుర్వేదమునందును సంపూర్ణ ప్రవేశముగల వీరు బ్రహ్మశ్రీ॥ లో॥ కామర్సు సుందరారాధ్యులవారికి మహాసాధ్వియగు రత్నాంబ

యందు కవిష్ఠపుత్రులుగా జన్మించిరి. వసిష్ఠగోత్రికులు. వీరి జ్యేష్ఠసహోదరులు (1) బ్ర॥ లింగమూర్తిగారు (2) బ్ర॥ రాజమౌళి ఆరాధ్యులు (3) బ్ర॥ వీరమౌళి గారు. ఇక నాలుగవవారే మన శాస్త్రిగారు.

శ్రీ శాస్త్రిగారు బాల్యకౌమారములయందు వేదశాస్త్రముల నభ్యసించి యౌవనము మొదలుకొని యనేక సభలయందు మహోపన్యాసములను పురాణ ప్రవచనము లను గావించిన యంశము సుప్రసిద్ధమైయున్నది.

శ్రీశైల మహాక్షేత్రమున శివయోగము నభ్యసించిన ప్రతిభాశాలురు. శివభక్తి వీరికి, వీరిధర్మపత్నికిని కొంగుబంగారమువంటిది.

వీరిధర్మపత్ని - మైసూరురాష్ట్రములోని పాండవపురమున భారద్వాజగోత్రికు లగు యన్. దాసప్ప, సౌ. వెంకటమ్మ అను వైదికపుణ్యదంపతులకు మూడవ కూతురుగా జన్మించిన సౌభాగ్యవతి పేరు కమలాదేవి.

అగస్త్యునికి లోపాముద్రవలె శ్రీ శాస్త్రిగారికి సహధర్మ చారిణియై తోడు నీడ వలె నుండును. ఇట్టి ఆదర్శదంపతులు కడుంగడు ప్రశంసనీయులని నివేదింపనైనది.

గ్రంథకర్త.



శ్రీ

ఏకశిలానగరము (వరంగల్లు) నందు

## శ్రీ దుర్గేశ్వరస్వామివారి ఆలయమున

చతుఃసూత్రి అనువాదము (ప్రథమభాగము)ను నాతో ప్రవచనమును చేయించి ద్వితీయభాగ ముద్రణమునకై ప్రోత్సాహమును కలుగఁజేసినవారు, మరియు ఈ (ద్వితీయభాగ) గ్రంథమును సముద్ఘాటనముఁగావించు మహోదారులు. వణిక్ ప్రవరులు నగు శ్రీయుత పడిశాల వీరభద్ర శ్రేష్ఠిగారు-శివాద్వైతసిదాంతాభిరుచిగలవారిలో నగ్రగణ్యులనియు, శ్రీముదిగొండ శంకరారాధ్యుల వారి శివభజన కీర్తనలు మున్నగు రచనల నచ్చొత్తించి యాగ్రంథములను మాహేశ్వరులకు నుచితముగా సమర్పించుచు ప్రతి శైవారాధ్యునకు నొక్కొక్క సువర్ణ(నవరస్) ముద్రిక మున్నగు వాని నొసఁగి యపారకీర్తి నార్జించిన వారనియు తెలుపుటకు మిగుల సంతసించుచున్నాను.

శ్రీ గణేశ కుమార వీరభద్రాది పరివార సహితులైన పార్వతీ రాజరాజేశ్వరులు శ్రేష్ఠిగారికి తదితర ప్రముఖులకును చిరాయురారోగ్యభాగ్యముల ననుగ్రహించి యవ్వారిని సకుటుంబముగా ననవరతము రక్షింతురు గాత!

గ్రంథకర్త.

శ్రీ గణేశాయనమః

# పీ ఠి క

న్యాయవేదాంతాయుర్వేదాభిజ్ఞులు

బ్ర॥ మూలంపల్లి రాజశేఖరశాస్త్రిగారు, లచ్చుపేట

## (శ్రీ కంఠ భాష్యాంధ్రానువాదము ప్రథమ సంపుటము తరువాయి)

పై విమర్శచే శ్రీ కంఠభాష్యము శంకరభాష్యమునకంటె ప్రాచీనమైనద సిద్ధమైనది.

శంకరాచార్యుల భాష్యరచనకు విశేషముగా తోడుపడినదిద్దియే; "అథాత బ్రహ్మజిజ్ఞాసా" అను ప్రారంభమునుండి చతుః సూత్రియు ఆనందమయా కరణము, ద్వితీయాధ్యాయంబు శాంకరభాష్యమున ఇంచుమించు శ్రీ కం శివాచార్య గతానుగతిక మనకు తప్పదు.

శంకరుఁడు సూత్రగతార్థమునే నిరూపించెను గాని శ్రీ కంఠాచార్య ననుకరింప లేదనని చో కొన్ని మతములు సూత్రకారుని యనంతరము మరికొని తత్పూర్వము నేర్పడినట్లు తెలియుచున్నందున ద్వితీయాధ్యాయమున సూ కారుడు సూత్రములచేతనే కొన్ని ప్రాచీన మతములను ఖండింపగా బౌద్ధ జైనా మత నిరాసమును శ్రీకంఠాభిప్రేతముగా శంకరుడు వివరించుటను తత్తద కరణములలో చూడనగును. అయిన నర్వాచీనములగు బౌద్ధజైన వాదము సూత్రకారుఁడు నిరసింపకున్నను శ్రీకంఠాచార్యులు తన్నిరాసమును ప్ర వాడగుటచే సూత్రానభిప్రేతార్థ ప్రతిపాదకత్వము శ్రీకంఠభాష్యము కళంక మగుననుట సరిగాదు. సూత్రకారుని కాలమున బౌద్ధజైన నామము లేకున్నను తత్సదృశవాదములు బీజరూపమున పొడసూపగా నవ్వానిని తజ్జ్ఞ యాచార్యులు తదనంతరులగుటచే నవ్వాని నామధేయములఁబట్టి తత్సాదృశ్య ననుసరించి వివరించి నిరసించిరి. అట్టి పద్ధతినే తదితర వ్యాఖ్యాతలు ప్ర యున్నారు. అందువలన శంకరుల భాష్యరచనకు శ్రీ కంఠీయ భాష్యము మ దర్శక మనుటలో సందియము లేదు.

"కథ మసతః సజ్జాయేత" అను శ్రుతి - బౌద్ధాంగీకృత అసత్కార్య వాదమును నిరసించినందున "బౌద్ధమతము తరువాతిది శ్రుతి" యనుట బాల భాషితము గాదా ? —

కావున శ్రీకంఠపథము రాజమార్గముగా ఇతరాచార్యులకు ఐనదనుట సమంజసమగుచున్నయది.

శ్రీకంఠాభిప్రేత సూత్రార్థ నిర్వచనము తాత్త్వికమగునెడ నద్దానినే గ్రహింపక శంకరాచార్యులు భాష్యాంతర రచన నేల యారంభించిరనినచో నాలకింపుడు.

శంకరుఁడు సమయోచితప్రజ్ఞ గలవాడు. సర్వతంత్ర నిష్ణాతుఁడు: అప్పుడు కుమారిలభట్టు ఖండించిన బౌద్ధమత జ్యోతి చల్లారలేదు. లోలోన రాజ్జిచుండుటను గమనించి బౌద్ధులగు గోవింద భగవత్పాదులను స్వపరమగురువులనుగా లోకమున కెరుకపఱచి బౌద్ధమతమునుండి మాయావాదమును గ్రహించి ఆస్తిక్యమును వైదికాచారములను కాపాడెను. అయ్యవి కాపాడబడునెడ "తదనంతరము వారు మాయావాద విరహిత కర్మజ్ఞాన సముచ్చయముతో (కూడిన) పరతత్త్వోపాసన మార్గమునకు శంకుస్థాపనఁ గావింతు" రని భావించిరి.

లేనిచో "ఋషిహృదయమునగు ర్తెరుగుటకు ఋషియగువాడే తగు"నను నానుడి ననుసరించి బోధాయనవృత్తి సూత్రానుగతమైనదని గ్రహించినను అద్దానిని సమయోచితముగా కాదని పైరీతిగా స్వమతము నుపపాదించిరి. తథాఽపి శంకరాచార్యులు ప్రతారకులనుటకు వీలులేదు. రోగికి తదిచ్ఛాఽనురూప వస్తు సమ్మిశ్రితముగా చేసి మందు నిడు వైద్యునివలె బౌద్ధమత రోగగ్రస్త లోకమునకు తద్రూపకంచుకాంతరిత వైదిక ధర్మమును ఆస్తిక్యమును బోధించుట దోషావహము కాదు. ప్రత్యుత గుణావహమై యున్నది.

గోవింద భగవత్పాదులు బౌద్ధులెట్లనిన? తద్రచిత గౌడపాద కారికల యందలి మంగళాచరణము ఆస్తికులెల్లరి కచుంబితరీతిని "ద్విపదాంవరమ్" అనునది నిదర్శనము. ఇద్ది దేవతావిశేషనామధేయము గాకుండుట గమనార్హము.

అట్లే అలాతోదాహరణము, నిర్వాణము సంవృతి మొదలగు పదజాలములు, రచనా పద్ధతియు, బౌద్ధగ్రంథరీతినే విశదపఱచునవి. అట్లైనచో శంకరా

చార్యులు కారికలకు వ్యాఖ్యానము నెందుకు వ్రాసినారనిన అవ్వాని కన్యార్థములను కల్పించి స్వాభిప్రేత వైదిక మార్గమునకు లాగినారని పైననే సూచింపఁబడినది.

శ్రీకంఠుఁడు శంకరభగవత్పాదులకేగాక రామానుజాచార్యులకును మార్గదర్శకుడైనాడనుట వింతగాదు.

శ్రీ రామానుజాచార్య సమయమున శంకరాద్వైతము విభిన్న పద్ధతులలో మిక్కిటముగా తాండవ మాడుచుండెను. శ్రీకంఠీయము కనుమఱుగై యుండెను. అట్టితఱి శ్రీకంఠ శంకర భాష్యములలో సూత్రానుగత మెద్దియో కనుగొనఁదలచి రామానుజుఁడు స్వప్రజ్ఞాబలంబున శ్రీకంఠీయమే సూత్రానుగత తాత్పర్యోద్భాసితమని గ్రహించి శివపరత్వమును మాత్రము త్రోసిరాజని సూత్ర వ్యాఖ్యానమును మక్కికి మక్కి ఒనగూర్చినాడు.

ఒకానొక సర్వశాస్త్ర కోవిదుఁడగు మతాచార్యుఁడు పరమత భాష్యమును సంగ్రహించిరనుట చెల్లదనినచో స్వతంత్ర ప్రజ్ఞాసంపన్నులగు రామానుజ ఆచార్యుల దృష్టికి నీలకంఠీయాభిన్న సిద్ధాంతము కనుపడినదన్నను నీలకంఠాచార్య సిద్ధాంతమున కలంకారమే యగును.

అట్లుగాక నీలకంఠ శంకర రామానుజ భాష్యములను నిష్పక్షపాత బుద్ధితో చూచినచో శ్రీకంఠీయభాష్యము ప్రాచీనమని యంగీకరింపవలసివచ్చును. మృదుమధురమైన గంగానిర్ఝరిణివలె సాగిపోవుచు అల్పవాక్యమున విపులార్థ రచనఁగలిగి స్వమత పోషణము దక్క నితర మత ఖండనయందు తత్పరత్వము లేకుండా శ్రీకంఠభాష్యము కన్పట్టుటకు హేతువెద్దియని పరీక్షకుల దృష్టికి దోవకబోదు. అద్దానికి శాంకరమతము శ్రీవారి కాలమున పుట్టకుండుట భాట్టమతము నైకశాస్త్ర్యముతో సమర్థించుట కారణముగా నాస్తికమత విరాసముతో మాత్రము తృప్తినందిరి.

శంకరాచార్యులవారి కాలమందుననో భాట్టమతము విశేషముగా విజృంభించినదై దైవాస్తిత్వమునే నిరసించు నంతవరకు జనుటవలన నద్దానిని ప్రతిఘటింప రెండంతలు బలమవసరమైనది. దాన ప్రధానమల్ల నిబర్హణ న్యాయాదుల సమంజసములు గాకుండెను. తదనంతర ప్రాప్తమగు రామానుజ సిద్ధాంతమునకు అద్వైత మొక్కటే కడు కంటక ప్రాయముగా నుంటమి అద్దియు (అద్వైతము)

తదనంతరాద్వైతులు ప్రతిపాదించిన మెరుగులతో నాస్తికత్వసమాన ప్రతిపత్తికి బీజరూపమగుటను గాంచి శ్రీ రామానుజాచార్యులు సవిమర్శముగా నద్వైతమును ఖండింపవలసి వచ్చెను.

ఈ రీతిగా చూచినను శ్రీకంఠాచార్యులు ప్రప్రథములనక తప్పదు.

సూత్రానుగత భాష్యమెద్ది?

"ఋషిత్త్వమును ఋషియే కనుగొను" నని పైననే సూచింపఁ బడినది గాన బాదరాయణ సూత్రములను బోధాయనవృత్తి ననుసరించి శ్రీకంఠాచార్యులు వ్యాఖ్యానమును రచించిరి. గీతాభాష్యమును గూడ నట్లే వ్రాసిరి గీతకు బోధాయనవృత్తి యున్నట్లు (ఆనందగిరి ౨ అ. ౧౦ శ్లో॥) శాంకరగీతాభాష్యమున వివరింపఁ బడినది. **అట్టి వృత్తి నేతదనుగత భాష్యమునే శంకరులు ఖండించియుండనోపు.**

శ్రీకంఠభాష్యము సంప్రదాయానుగతమైనది. ప్రాచీన సంప్రదాయమును సరుకుగొనక కేవలతర్క ప్రతిభాప్రభావమున విలసిల్లినది శాంకరము; అందువలన నద్వైతేతర పండితులు శంకరుఁడు ప్రచ్ఛన్నబౌద్ధుడనియు విదేశీయ విమర్శకులు శంకరుని వ్యాఖ్యానము సూత్రానుగతమైనది కాదనియు తెలిపిరి.

భాష్యకర్తలందరు సూత్రముల ననుసరింపలేదు గాన శంకరుని భాష్యము సరిగాదననేల? (పుట 370, సంపుటము 2, ఇండియన్ ఫిలాసఫీ) ఇట్లనుటలో తాత్పర్యము:-ఇతరుల తప్పులను చూపుచు తన పిల్లవాని తప్పును సమర్థించు తల్లి చందమున హాస్యాస్పదమగును. ఇందువలన తేలినదేమనగా? సూత్రకారునితో శంకరుఁడు భేదించినాడని విశ్వేశ్వరానంద రాధాకృష్ణులు గాక "నస్తౌమి తంవ్యాస మశేషమర్థం-సూత్రైః సమస్తైర్నబబంధ సమ్యక్, వినాఽపి తైః సంగ్రథితాఖిలార్థం-తం శంకరం నౌమి సురేశ్వరంచ, "స్వాభీప్సితార్థమును నిర్వచించని వ్యాసులను నమస్కరింపననియు వ్యాససూత్రములలో లేని విషయముల ననువదించి కూర్చిన శంకరుని సురేశ్వరుని నమస్కరింతు" నని మధుసూదన సరస్వతి వ్రాక్రుచ్చెను. పై వివరణముచే సూత్రవిరుద్ధమైనది శంకర భాష్యమనుట నిస్సంశయము. మరియు ఆధునికులు పలువురు "శంకరుఁడు సూత్రములకంటె శ్రుతులకు సన్నిహితుడ"ని చెప్పినచో సూత్రవిరుద్ధార్థము శ్రుతు

లలో లేనందున శ్రుతిసన్నిహితుడగు శంకరుఁడు వేదప్రతికూలములగు సూత్రము లకు వ్యాఖ్యానము నొనర్చుట నిష్ఫలంబగును. ఇంతియేగాక వ్యాసుఁడును వేద విరుద్ధ సూత్రములను రచించినవాడగుటచే ప్రమాణభూతుఁడు కాకుండును.

వీరేగాక బౌద్ధులును "ఏతేన ఆధునికానాం వేదాంతి బ్రువాణా మపి మతం విజ్ఞాన వాదతుల్య యోగక్షేమతయా నిరస్తమ్"

విజ్ఞానభిక్షువు, సాం॥ప్ర॥భా. ౧

ప్రాచీనాగమ పురాణ భగవద్గీతోపనిషదము లనేకముల ననేక పర్యాయము లుదాహరించి శ్రీకంఠీయము సంప్రదాయానుగతత్వమును చూపుచున్నది.

## శైవమతము. తత్త్వశాస్త్రము.

ఆధునికులు పాశ్చాత్య విచార దర్పణములచే భారతీయార్ష సంప్రదాయ ములను విమర్శింప సమకట్టిరి. వారి యూహలు పాశ్చాత్యులకుగూడా నాశ్చర్య మును కలిగించునట్టివి. ఇట్లు పరవిచారానుకరణ బద్ధాదరులై అనాది సంప్ర దాయములనే విమర్శింపఁబూనిరి.

ఆర్యులు భారతీయులు కారనియు అనార్యులే భారతీయులనియు వేద ములు ఆర్యులప్పుడప్పుడు పాడిన పాటలనియు ఆగమము లనార్యులవనియు ఆగమములు వేరు, వేదములు వేరు, ఆర్యులు వేరు, అనార్యులు వేరు, అని భారతదేశ పవిత్ర సంస్కృతినే విభజింప సమకట్టిన అంధులను నామార్గము నవలం బింప వెనుకాడని యంధ పరంపరను జూడ జాలి గలుగుచున్నయది.

వైదిక సమాజ మొకరీతిగా నుండవలెననిన విభిన్నతకు తావులేదని వారు మొదలు నిర్ణయించుకొని వేదవిమర్శకు కడంగవలెను. అట్లుగాక వేదము లలో నాగపూజనము వృక్షపూజనము ఏదైన చెప్పబడిన నద్ది యనార్య సంప్ర దాయమనియో లోకవేద విరుద్ధ సంస్కృతికి సంబంధించినదనియో చెప్పట యొకానొక ప్రహతమైనది.

ఒక సమాజమునందు సర్వవిధ ప్రకృతులు గలవారుండవచ్చునని యంగీక రించిన వైదికకాలమునందు నిమ్నశ్రేణియందు గల దేవతలను పూజించుటయు సమున్నతమైన పరమేశ్వరార్చనయు తత్త్వవిచారకశ్రేణి యుండవచ్చునని

యంగీకరింపవచ్చును గదా! ఋగ్వేదమును చదివిన పాశ్చాత్యు లెందరో ననేక స్థలములందు తత్త్వవిచారము కలదని నుడువలేదు.

"ఋగ్వేదకాలమున తత్త్వవిచారము కలదను నెడల నట్టి తత్త్వవిచార మలవడు నెట్లు? అట్లు స్ఫురించిన దనినచో నకాలమున తత్త్వవిచార మున్నత దశలో నున్నదని యంగీకరింపక తప్పదు.

అని యరవిందఘోషు విమర్శించెను.

తత్త్వజ్ఞానమునకు సంబంధించిన విషయము చాలా తక్కువ యనినచో మంత్ర సంఖ్య తక్కువ యున్నను తత్త్వవిచార మెంత గొప్పదియో తెలిసికొనుట యావశ్యకము.

లోకమున తత్త్వజ్ఞానుల సంఖ్య యితరుల కంటె తక్కువ యుండును. ఇతర గ్రంథముల దృష్ట్యా తత్త్వజ్ఞాన గ్రంథములు చాల తక్కువే గదా!

వాఙ్మయములో లేని విషయములను గ్రహించి కుతర్కముల నొనర్చుట పాశ్చాత్య విద్యావిదుల రెండవదోషము. ఋగ్వేదమున ఉప్పు లేదనియు ఉన్నచో నద్దాని నుదాహరింప లేదనియు వేదపురుషునికి సముద్రము గుర్తులేదనియు దోష భావమును గ్రహించినను పంజాబులో ఉప్పునకు సంబంధించిన ఖనిజరాసు లనేకములున్నవి గదా!

ఇట్టి దుర్వాదములను దూరమొనర్చి విచారించినచో ఋగ్వేదము సమస్త వస్తువులఁ జెప్పు నిఘంటువగునెడ ఋగ్వేదమునందు సర్వవిషయములు సర్వవస్తువులును రావలసియుండును. ప్రసంగవశమున సర్వవిషయములు సర్వవస్తువులును సంపూర్ణముగా రావచ్చును రాకపోవచ్చును. ఋగ్వేదమునందు మొదటి మండలమున నే 99వ సూక్తమున (1000) వేయి మంత్రములు నష్టమైనట్లు కాత్యాయన ఋషి యొక్క సర్వానుక్రమణికవలనఁ దెలియుచున్నది.

ప్రస్తుత వైదిక వాఙ్మయము పరదేశీయుల దాడులచే యెంత నష్టమై యుండవచ్చును? ఇద్ది సామాన్య చరిత్రజ్ఞానము గలవారికి గూడా తెలిసినదే; అవిచ్ఛిన్న సంప్రదాయము వేదమూలమైనదని మంగళాచరణమునకు న్యాయవాదుల వాధ మిచ్చోట గనుగొనగలరని తెలుపుచున్నాడను.

వేద వేదాంతముల యందు చెప్పఁబడిన సిద్ధాంతములకు పూర్వము వానిపై గల విచారము (శంకాసమాధానాదికము) తార్కిక దృష్టితో వివరింపఁబడి యుండదు. తదనంతర విరచిత దర్శనములవలె సాధకబాధకములను విచారించి వ్రాయఁబడినది కాదు. అందువలన వేదవేదాంతములఁ జదివి యవ్వానియందు నిరూపింపఁబడిన దెద్ది? యని విచారించుట తప్పుగాదు. కాని మానవచరిత్ర ననుసరించు వైదిక వాఙ్మయచర్చ చేయవలెననుట సరిగాదు.

ఆధునిక పరిణామవాదులు-జడములు తదనంతరము చేతనులు జలచరములు పశువులు మానవులని చెప్పు స్వకపోలకల్పనలఁ జేయు వాదము మరియు నాలుగైదు వేలేండ్లకు పూర్వము సృష్టియే లేదను క్రీస్తువాదము, రెండు వేలేండ్లకు పూర్వము లేమిచే హాస్యాస్పదము అగుచున్నయవి. ఇక ననాది సర్గమునకు ప్రతిసర్గముఁ జెప్పు వేదముల విషయము నప్రామాణిక మనఁ జెల్లునా?

భాషాసాదృశ్యముచే సమానైక్యమును సాధింప నెంచుటయు దోషమైయున్నది. స్వరయంత్రమునకు చెందిన మానవ ప్రకృతి సాదృశ్యమున విభిన్నవాసులకు సామ్యముగల పదములు కొన్ని యున్నంత మాత్రమున నేకదేశీయులుగా చిత్రింప నుంకించుటయు దోషమే గాన సంప్రదాయ సిద్ధచరిత్ర వలన నిర్ణయింపబడినదే సత్యము.

ఆగమములు శ్రుతులు పరస్పరము సహకారము కలిగి విరాజిల్లుచున్నయవి. వేదములకు శివాగమములకును భేదము లేదనియు ప్రాచీనుల యాశయము వేదములుండగా ఆగమము లేలయన? అధికారి (ర) భేదము ననుసరించి శైలీభేదమేగాని అర్థభేద మావంతయు లేదని విద్యాస్థానవినిర్ణయమను గ్రంథమున మద్గురువర్యులగు బ్రః ముదిగొండ నాగలింగశాస్త్రి గారిచే సోపపత్తికముగా నిర్ణయింపఁబడినది. కావున ఆర్యానార్య భేదకల్పనము - భారతదేశ సంస్కృతి ఐక్యమును వినాశ మొనర్పు తలంపున కల్పింపఁ బడిన పాశ్చాత్య వైదుష్యమునకు తావీయకుండుటే శ్రేయోదాయకము.

"ఆర్యుల చరిత్రము—భారతదేశ చరిత్రమగును. భారతీయ సంస్కృతి ఆర్యులే మూలపురుషులు" అని ఇ. బి. హావెల్ పండితుఁడు "ఆర్యన్‌రూల్ ఇన్ ఇండియా" అను గ్రంథమున వ్రాసెను.

"భారతీయ సంస్కృతి సర్వస్వము వేదములయందు గలదు. ఈనాటి ప్రజా స్వామ్య పద్ధతికి నవసమాజ నిర్మాణమునకును బీజము లవ్వానియందే గల"వని రాధాకుముద ముఖర్జీ "గ్లింప్సెస్ ఆఫ్ ఏన్షియెంట్ ఇండియా" అను గ్రంథమున వివరించిరి.

"తుష్యతు దుర్జనః" అను న్యాయము నంగీకరించి విచారింతము. ఆర్యులు రాకపూర్వము భారతదేశ సంస్కృతి యెద్ది? ఆర్యుల సంపర్కమున పెంపొందిన దెద్దియో చూతము.

మొహంజోదారో, హరప్ప మొదలగు సింధుప్రాంత భూగర్భ పరిశోధన లొనర్చిన వారిలో బిషప్ కాల్డ్వెల్, శ్రీనివాస అయ్యంగార్ ముఖ్యులగువారు. మరికొందరు మార్షల్ వీలర్ పిగ్గాట్ మొదలగువారు. ఆనాటి ప్రజల నగర నిర్మాణ దక్షత, గృహనిర్మాణ విధానము, ఉపకరణములు, పాత్రలు, మృణ్మయ దర్పణములు, నీటిపారుదల, భోగములు, భూషణములు, ఉద్యాన కల్పనలు, వీధులు, కళాకౌశలము ఇత్యాది విశేషములు ప్రస్తుత నాగరికులకు దిగ్భ్రమను కలిగించునవిగా యున్నవని తెలిపినారు.

మరియు సంస్కృత భాషయందలి కదళీ కార్పాస నింబ జంబుక నారికేళ అలాబు శ్యామ పదములు నదీనామములు స్థల నామధేయములును నిషాద భాష నుండి వచ్చినవే యనియు, వ్యవసాయము, తోటలు వేయుట, చెరుకు పండించుట, పంచదార చేయుట, పసుపు కుంకుమ తాంబూలముల నిచ్చుటయు, నిషాదుల యాచారములు కావున నవ్వారి మతప్రచారము లీనాడు భారతీయులందరిలో చెల్లుచునేయున్నవి. వారారాధించు దైవములు-నాగదేవత, కాళీశక్తి, శివలింగ ములు నైయున్నవి. వారి వ్రాత విజ్ఞులకుగూడ తెలియరానిది. వివాహాది శుభ కార్యములు నవార్యులగు ద్రావిడుల యాచారములని వివరించిరి.

"భారతీయుల ఆర్థికవిధానము ఆచార వ్యవహారములు, వేషభాషలు, మత సంప్రదాయములును ఆర్యులకు పూర్వమే విస్పష్ట రూపమును ధరించి యున్నవి" ముజుందార్.

కర్ణాటక భాషా నిఘంటు నిర్మాతయగు కిట్టల్ దొరగారి వివరణ ప్రకారము సుమారు 100 నిషాద శబ్దములు 450 ద్రావిడశబ్దములును సంస్కృతమున గలవని తెలియుచున్నది.

పై విశేషములు నాగరికతా మూలములైన ననార్యుల యాచారములని నుడువుట నుడిగిన మానవత్వముగూడ నుండునాయని విజ్ఞులూహింతురు గాత!

అందుననే భారతీయ సంస్కృతి యనఁగా? ఆర్య సంస్కృతి మాత్రము కాదనియు భారతీయ సంస్కృతి వికాసమునకు నిషాద ద్రావిడజాతులే యార్య జాతికంటె నధికముగా దోహదమును చేసినవనియు శ్రీ కల్లూరి బసవేశ్వరరావు గారు ఆంధ్రపత్రిక సంచిక 1963 లో వ్రాసినారు.

శివుఁడు ద్రావిడుల దైవము. కృష్ణుఁడు వైదిక దేవతయగు ఇంద్రునికి విరోధి. విష్ణువు నల్లనివాడగుటచే ద్రావిడదైవము. విష్ణువాహనమగు గరుత్మంతుఁ డనార్యదైవము. అణ్, మంతి యనగా మగకోతియని ద్రావిడుల యర్థము. అద్దియే వికృతిఁజెంది హనుమంతుఁడాయెను. ఆర్యులు పత్ర పుష్పములతో పూజించ మెరుఁగరు. హోమము నెరుఁగుదురు. పూ. అను పదమునకు పూవనియు జె. యనఁగా చేయుటయనియు పుష్పకర్మఁజేయుట (The vedic age P.C. మజుందారు) "పత్రం పుష్పం ఫలం తోయమ్" అని ద్రావిడాచారము భగవద్గీతల వరకెగ్రాకినది. దుష్టశిక్షణ శిష్టరక్షణలకై యవతారము నొందుట నిషాదుల సిద్ధాంతము. ఇదంతయుగాంచి విసుగొందిన రవీంద్రనాధ టాగోర్ గారు ఆర్యుల పరతత్త్వ చింతనము ద్రావిడుల రసభావమయ సృజనాత్మకమగు కళాశక్తితో సంగమించి నూతనసృష్టి నవతరింపఁజేసినది. భారతీయ సంస్కృతి ఆర్యనాగరికత కాదు. ద్రావిడనాగరికతయు కాదు.

అయ్యది భారతీయ నాగరికతయే (ఎ. విజన్ ఆఫ్ ఇండియన్ హిస్టరి).

హవనకుండమునకు యోనిఁ గల్పించుటయు శ్రీ చక్రమునకు రెండు త్రికోణముల సంయోగము నేర్పరచుటయుఁ జూడగా భగముగలవాడు భగ వంతుఁడను నిర్వచనమును చేయనగును. ఇత్యాది విభిన్నాభిప్రాయముల నాధు నికులు కల్పించి ప్రాచీన హైందవ ధర్మవిశ్వాసమును నాశమొందింప సమకట్టి నారు. ఇట్టివారిని చూచియే వేదము భయపడునది.

"బిభేత్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరేదితి" ఏ బ్రాహ్మణులు భారతదేశమున వైదిక మతమును స్థాపించినారో వారే నేడద్దానిని హతమార్చు చున్నారు. ఇందుకు మన పూర్వులు తెలిపిన ప్రమాణము "రాక్షసాః కలి మాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు."

"శైవమత మనార్యులది" యనుటలో శివుడనార్యుడా? లేక మతము అనార్యులదా? అను ప్రశ్నలు పొడసూపును. అద్వైతాచార్యులు వైదికమత స్థాపకులునగు శంకరులు శివావతారమనియే వారు చెప్పుచున్నందున ప్రథమ పక్షము యుక్తముకాదు. ఇఁక రెండవది యెట్టిదనినచో శివలింగమును పూజించి నందువలననే శంకరాచార్యులు ప్రాదుర్భవించిరని చెప్పుటవలన శైవమతంబు ననార్యులది కాదని బోధపడును. సూత్రకర్త యనార్యుడగుచో తద్విరచిత సూత్రములు నభేద్యములగు నుపనిషదముల తాత్పర్యమును నిర్ణయించుటకు శిరోధార్యములగుట యెట్లు?

కృష్ణావతారలీలలు బలరాముని సురాపానాది ప్రసంగములు భగళబ్ద నిర్దిష్టమగు భాగవత సంప్రదాయము పాంచరాత్రాగమములు నివ్వానిపై చూపని దోషములను శైవులపై ప్రదర్శించునెడల సమాధానమును చెప్పెదము.

శైవమతము ఆసేతు హిమాచలము విరాజిల్లుచు వేదములకు వేదములను కనుగొనిన ఆర్యులకును ప్రాచీనమై సర్వతోముఖ వ్యాప్తిఁ జెందినది. ఈ యంశమును ప్రాచీన ఆర్ష సంప్రదాయాభిజ్ఞు లంగీకరించునెడల వేదముల యపౌరుషేయత్వము కుంటుపడును గాన నవ్వాని ప్రాశస్త్యమే సన్నగిల్లును. అందువలన ఆర్యానార్య చర్చను లేవదీసి అనార్యతా నిమిత్తముగా శివునకు శైవమతమునకును న్యూనతఁ జూపుట పాడికాదు.

ముక్తినిరూపణ లేని వేదాంతమే లేదు. అట్లే ధర్మహీన మైనదియు లేదు. ధర్మము వేదవిహితాచరణ గలది. వర్ణాశ్రమ చతుష్టయ విశిష్టము. వీరశైవము చాతుర్వర్ణ్య విభాగము లేనిది. ఆది శైవులనఁబడు తంబళులు తాంత్రికులగుదురు. శ్రీ నీలకంఠాచార్యుల వారు అష్టచత్వారింశత్సంస్కారముల నంగీకరించి యపశూద్రాధికరణమున శూద్రునకు బ్రహ్మోపదేశమును చేయగూడదని నిరసించుటఁ జూడగా వారు వైదిక శైవముఁ గూర్చియే ప్రస్థానములను రచించిరని విశదమగును.

అపౌరుషేయములు ఈశ్వర కర్తృకములునగు వేదము లనాదులగుటచే భిన్నకాలములకుఁ జెందినవని శ్రుతులను విమర్శింపరాదు. ఇందువలననే గదా బౌద్ధుడైనను ప్రాచీనములను విరసింపక నమరకోశమున నమరసింహుఁడు "ఇతి వేదాస్త్రయ స్త్రయీ" అని చెప్పినాడు.

వేదాంతములనఁబడు ఉపనిషదములలో పదింటిని ప్రమాణములుగా భావించి ఆచార్యులు భాష్యములను వ్రాసిరి. ఇట్టి దశోపనిషదముల యందలి తత్త్వమును విచారించుటకు పురుషబుద్ధి కల్పిత నిర్ణయములు సదోషములగునవి సూత్రములను బాదరాయణులు వ్రాసియున్నారు.

బాదరాయణుఁడు పరమశైవుఁడు కావుననే గురువగు గౌతముని న్యాయశాస్త్రమును ఖండింపలేదు. గౌతముఁడును బాదరాయణ సూత్రములను ఖండింపలేదు. ఉభయులును సమకాలికులు. అంతియేగాదు. (న్యా. సూ. ౩.౧.౫.౩౦) ఆత్మశ్రుతి ప్రమాణమున తెలియునది. వేదాంత సిద్ధాంత మిందు సూచింపఁ బడినది. గౌతముఁడు చాలచోట్ల బాదరాయణుని భావములను సరిగా ననుసరించును. (చూడుడు న్యా. సూ. 1, 64, 3, 2, 14, 16,) గౌతముని శిష్యుఁడని ప్రసిద్ధిఁ బొందిన వ్యాసుఁడు ముఖ్యముగా న్యాయసిద్ధాంత మీశ్వరుని యంగీకరించునదగుటచే ఖండింపనవసరము లేదని తలచియుండనోపు. రాధాకృష్ణ పండితుఁడు "భారతీయ న్యాయశాస్త్ర గత ద్వితీయాధ్యాయమునకు వేదాంతసూత్రములకును పెక్కు సామ్యము కలదని సూచించెను. గౌతమునకు అక్షపాదుఁడని నామాంతరము. వాత్స్యాయన ఉద్ద్యోతకర మాధవులును "గౌతముఁడు న్యాయసూత్ర కర్త" యని నుడివిరి.

పద్మపురాణము ఉత్తరఖండము. స్కందపురాణము కాశికాఖండము. ౧౭౫ గౌతముఁడు ధ్యానగతుడై నూతిఁబడి పోవగా నతనివి పరమేశ్వరుఁడు కరుణించి పాదమునకు నేత్రము నొసగుటచే యక్షపాదుడనఁబఱగెను.

ఈరీతిగా పరిశీలించినచో గౌతముని తర్కము కణాదుని వైశేషికము రెండును శైవదూరములు కావని నిరూపింపవచ్చును. నైయాయికులు శైవులనియు వైశేషికులు పాశుపతులనియు జెప్పుదురు. జినదత్తుఁడు వివేకవిలాసమునందు (౧౩వ శతాబ్దమున) న్యాయ వైశేషిక వాదులకు నిష్టదైవము శివుఁడని చెప్పినాడు. ఉద్ద్యోతకరుఁడు పాశుపత మతస్థుఁడు. సర్వజ్ఞుఁడు తన ధ్యానమున మహేశ్వర సాక్షాత్కారము నందినట్లు నుడివెను. శివుఁడే పరబ్రహ్మయని యుదయుని వాక్కు.

రాధాకృష్ణుఁడు- భారతీయ తత్త్వశాస్త్రము. న్యాయసిద్ధాంతము ద్వితీయాధ్యాయము పుట 423.

న్యాయసారము, పుట 39. న్యాయకుసుమాంజలి 2-4, గుణరత్నుని షడ్దర్శన సముచ్చయ వృత్తి పుటలు 49-5,హారిభద్రుని షడ్దర్శన సముచ్చయము.

అతఃపాదమతే దేవః-సృష్టి సంహారకృచ్ఛివః

విభుర్నిత్త్యైక సర్వజ్ఞో-నిత్యబుద్ది సమాశ్రయః॥

రాజశేఖరుని షడ్దర్శన సముచ్చయము-ఈ భావమునే చెప్పునని "కీత్. ఐ. యల్. వి. పుటలు 262, 263"

ఐతే న్యాయ వైశేషికానుబద్ధమై పాణిన్యాద్యార్ష పరంపరానుగతమై సూత్రానుగతమైన శివాద్వైతము, శైవమతము, శివోపాసనయు భారతదేశమున తదితర ఖండములలోను వ్యాపించియుండుట చారిత్రికులకు మరియు భూగర్భ పరిశోధన ప్రవీణులకును సువిదితము.

కాశ్మీరశైవము కాశ్మీరమున నభినవ గుప్తాది మహా మనీషిజన సమాచరితమైనట్లు లకులీశ పాశుపతమను శైవము సోమనాథమున ఘూర్జరమున నుండెడిది.

మహారాష్ట్రమున హారనాథ జ్ఞానేశ్వరాది యోగులచే రచింపఁబడిన జ్ఞానేశ్వరి, అమృతానుభవము, మొదలగు గ్రంథములవలన శైవము మూర్ధన్యమని తెలియవచ్చును. ఆంధ్రదేశమున నన్నెచోడుడు, నన్నయ, సోమనాథుఁడు మున్నగు కవితల్లజులచే శైవమతము 11-12 శతాబ్దముల పూర్వము వరకు మహోన్నతముగా భాసింపఁజేయఁ బడినట్లు చరిత్రవలన స్పష్టమగుచున్నది.

జ్ఞానేశ్వరుఁడు భాగవత సంప్రదాయ పరుడని కొందరు తలతురు గాని వారు జ్ఞానేశ్వరిని అమృతానుభవమును చక్కగా చదువకపోవుటయే అందుకు కారణమని తోచెడిని. జ్ఞానేశ్వరుల ఆచార్యులగు నివృత్తి నాథులవారు తమ గురువులగు గహనీనాథుల యోగ సంప్రదాయమును మనస్సునం దిడుకొని కలికల్మష బాధిత ప్రజల నుద్ధరింప పూర్వాచార్య పరంపరానుగతమైన ధర్మమును భగవద్గీతలయందు నుపదేశింపుమని యాజ్ఞాపించిరి. జ్ఞానేశ్వరులు గురూపదేశము ననుసరించి శివలింగసన్నిధిని జ్ఞానేశ్వరిని వ్రాయఁగడంగిరి. గీత 18వ అధ్యాయమున శివాలయ నిర్మాణమైనదనియు లింగప్రతిష్ఠ ముందు జరుగుననియు శివాలయ నిర్మాణముఁ గూర్చియు మరాఠీఓవీలలో చెప్పిరి. శివలింగపూజ యనివార్యమనియు శివయోగము మానవునికి తరణోపాయమనియు నిర్వచించిరి. భగవద్గీత-శ్రీకృష్ణ

ప్రోక్తమగుటఁ జేసి కృష్ణస్తోత్రమును గూడ గావించిరి. వామన పండితుఁడు భగవద్గీతకు వ్యాఖ్యానముఁ జేయుచు "జ్ఞానేశ్వరులు భాగవతుఁడు కారనియు అన్యదేవతోపాసకులనియు జ్ఞానేశ్వరి ఆదిలోనే ఇతర దేవతా స్తవము లొనర్చిరనియు అందువలన జ్ఞానేశ్వరి భాగవతులకు ననుపాదేయ మనియు నిర్వచించెను. ప్రత్యుత జ్ఞానేశ్వరిలో "ఓం నమో ఆద్యా" యని యోగసంప్రదాయమున కాద్యుఁడగు శివునిఁ గూర్చి మంగళాచరణమును చేసి భగవద్గీతా వ్యాఖ్యానము వ్రాయఁబడెను. చివరన "ఇతి మాహేశ్వరాన్వయ సంభూతః" అని తన వంశమును మహేశ్వర వంశముగా నుడివిరి. శివలింగోత్తమాంగుడగు విఠ్ఠలేశ్వరుఁడు శివభక్తులలో నగ్రగణ్యుడని భావించి విఠ్ఠలేశ్వరుని పూజించిరని వారి యభంగముల వలన విదితమగుచున్నయది.

ఇట్లే త్రిలింగదేశమున గూడా పోతనపూర్వులు పరమశైవులుగా నుండిరి. పోతనయు హరిహరాద్వైతవాది యనుటకు వీరభద్రవిజయము భాగవతమున్ను సాక్షులు. ఐతే శివాద్వైతము సర్వజనాంగీకృత మైనను కలిప్రభావమున నేర్పడిన వైదికావైదిక మతముల యార్భాటమున మఱుగుపడి తిరిగి ప్రకాశించుచు సూర్యసన్నిభ మగుచున్నయది.

ఇఁక నీ భాష్యమున ప్రమితాధికరణమున సూత్రములన్నియు శివపరాత్పరత్వమును సమర్థించుచున్నవని స్పష్టముగా నిరూపింపఁబడినది. అనీశ్వరవాదము నానేశ్వరవాదము అనామక బ్రహ్మవాదంబు సూత్రకారునకు తన్మూలభూత ఉపనిషదములయం దప్రసిద్ధమగుటచే ననంగీ కార్యములనుట నిర్వివాదము. ఇట్లే యనేక విషయములను చెప్పుచు శ్రీ నీలకంఠ శివాచార్యులవారు తమ సూత్ర భాష్యమున నితరనింద లేకుండా స్వమత సిద్ధాంతమును చేసియున్నవారు. ఇయ్యది సర్వభాష్యముల కందని ఫక్కియని యొప్పుకొనక తప్పదు. శ్రీ నిర్మలశంకర శాస్త్రిగారి ఆంధ్రానువాదంబు నా పద్ధతిలో నడచినది గావున అమరభారతిని సంపూర్ణముగా నెరుగని శైవులకు శివాద్వైత పరిజ్ఞానమును కలుగజేయుటలో నసమానమని తెలుపుచు నా యీ పీఠికను విస్తరభీతితో విరమించుచున్నాను.

ఇట్లు
మూలంపల్లి రాజశేఖర శాస్త్రి
ఆరాధ్యులు.

# నివేదన

పరమేశ్వరుని యనుగ్రహమున మన్మథవత్సరమున నిర్మలగృహమునందు ప్రారంభించి పదునొకండు వత్సరములలో శ్రీ నీలకంఠీయ శారీరక బ్రహ్మ మీమాంసా సూత్ర భాష్యమున చతుః సూత్రి యనువాదమును ప్రథమ సంపుటముగాను ప్రథమాధ్యాయ అనువాదమును ద్వితీయ సంపుటముగాను వ్రాసి ముద్రింపఁజేయఁ గలిగితిని.

ఇఁక రెండవ యధ్యాయము మొదలుకొని భాష్యాంతమువరకు తృతీయ సంపుటముగా వ్రాసి ముద్రింపఁజేయుటకు వలయు సమయ సంపదలకై నిరీక్షించుచు ఇద్ది నావలన నగునో కాదోనని యాందోళనఁ జెందుచుందును.

మరియు శ్రీమద్భగవద్గీతకు శివపరముగా నర్థమును తెలుగున వ్రాయవలెనని విద్యన్మాహేశ్వరుల ప్రోత్సాహము పొడగట్టుచున్నది.

ఐతే ఈ యనువాదమున తత స్తతః శ్రుతులకు తదితరములకును తెనుగర్థ మును వ్రాయలేదు. అంతమాత్రమున నవ్వాని యర్థము ఇదే గ్రంథమున మరియొకచో లేదని కాదు. గైర్వాణీకోవిదుల కియ్యది యనపేక్షితమగుటయు ఆంధ్రభాషాఽభిజ్ఞు లకు యనువాదము - అభిమానపాత్రము గాకుండుటయు ప్రాయశః అల్పజ్ఞులకు నర్థముగామి రుచింపకుండుటయు అనంతరానువాదమును వ్రాయ గడంగుటకు ననుత్సాహమును కలిగించుచున్నవి.

తథాఽపి కొందరు శైవసంప్రదాయలోలురు పండిత ప్రకాండాభివివేకముగల వారు శివాద్వైతసిద్ధాంతజిజ్ఞాసతో బాసటగా నున్నందున నింతవరకీ యుద్యమమును కొనసాగింపఁ జాలితిని. శివానుగ్రహము కలదేని సంపూర్ణముగా భాష్యము ననువ దించి కృతార్థుడను కాగలను.

సరసహృదయులగు మాహేశ్వరుల సాహాయ్యము, మరియు శివభక్తులగు ధనికుల ధర్మబుద్ధియు, మాతృభాషాఽభిమానులగు ఉదారుల తోడ్పాటున్ను శివాను గ్రహమును బలపఱచునవి యని నివేదన.

నిర్మల శంకరశాస్త్రి

# విషయసూచిక



## మహారాజ పోషక ఛాయా చిత్రములు



## గ మ ని క

ఇందు అచటచట అచ్చుతప్పులు కొద్దిగా ఉన్నందున తప్పొప్పుల పట్టికను వేయలేదు. సాధ్యమైనంతవరకు జాగరూకతతో నా యీ అనువాదమును నిర్దుష్టముగా సర్వాంగ సుందరముగాను ముద్రించి యిచ్చినందులకు నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్ వారి నెంతయో అభినందించుచున్నాను.

గ్రంథకర్త

## ఈ భాష్యానువాదము నామోదించి సత్కరించిన గౌరవనీయులు

1. శ్రీ రావుసాహేబు బూసగు మహదేవశ్రేష్ఠిగారు, సికింద్రాబాద్.
2. శ్రీ ఓనమాల వెంకయ్య శ్రేష్ఠిగారు, ,,
3. శ్రీ బెల్దెజగదీశ్వరయ్య శ్రేష్ఠిగారు, ,,
4. శ్రీ బెల్దె కుమారస్వామి శ్రేష్ఠిగారు, ,,
5. శ్రీ అమ్మనబోలు రాజయ్య శ్రేష్ఠిగారు, ,,
6. శ్రీ ఉప్పల గౌరీశంకర్ గుప్త (రాజయోగి) గారు, ,,
7. శ్రీ దాచేపల్లి నర్సయ్య శ్రేష్ఠిగారు, ,,
8. శ్రీ లింగా శేఖరయ్య శ్రేష్ఠిగారు, ,,
9. శ్రీ రాచకొండ నారాయణ శ్రేష్ఠిగారు, ,,
10. శ్రీ రావుసాహేబ్ చిదిరా దూర్వాసులు శ్రేష్ఠిగారు, ,,
11. శ్రీ ఉపలంచి బాబయ్య శ్రేష్ఠిగారు, మారేడుపల్లి, ,,
12. శ్రీ తొడుపునూరి పావయ్య శ్రేష్ఠిగారు మారేడుపల్లి, ,,
13. శ్రీ పి. యమ్. రామదాసుగారు, బీడిఫ్యాక్టరీ, ముషాకల్. ఆర్మూరు తా॥
14. శ్రీ బొంబై రాజారాం గుప్త మొదలగు శిష్యులు, సద్భక్తులున్ను
15 శ్రీ గోలి ఈశ్వరయ్య గారు, పేపరుమర్చంట్, సికింద్రాబాద్.

## భాష్య గ్రంథప్రచారకులు

1. బ్ర॥ శ్రీ॥ ముదిగొండ మల్లయ్యగారు, కవాడిగూడ, శంకర్‌బాగ్, సికింద్రాబాదు.
2. ,, ములుగు పండితయ్య ఆరాధ్యుల వారు, (ఈమని) సికింద్రాబాద్.
3. ,, కొడిమేల నాగమల్లికార్జున శర్మగారు, వరంగల్
4. ,, ముదిగొండ అంగీరసశర్మగారు, సంగారెడ్డి
5. ,, రామగిరి సిద్ధరామేశ్వర శర్మగారు, లచ్చుపేట
6. ,, గూడూరు సిద్ధరామేశ్వర శర్మగారు, ,,

(వీరు తమవాగ్దానముల నందజేసినారు)

,, ఇంకను ఆప్తులు, శిష్యులు, భక్తులున్ను.

శ్రీ నీలకంఠాచార్య సద్గురూపదేశః సమభివర్ధతామ్



గ్రంథకర్త

నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు, తత్కుటుంబమున్ను

నివాసము - నిర్మల, సికింద్రాబాద్.

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాన్నమః

శ్రీ నీలకంఠ భగవత్పాదకృత

# శారీరక బ్రహ్మమీమాంసా సూత్రభాష్యము

[ ఆంధ్రీకరణము ]

చతుఃసూత్రి తరువాయి

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" మొదలుకొని "తత్తు సమన్వయాత్" వరకు గల నాలుగు సూత్రములందు బాగుగా చెప్పఁబడిన బ్రహ్మలక్షణము ప్రధానము (ప్రకృతి) నందు వర్తించునని యాశంకించి దిగువ సూత్రమును శ్రీ వేదవ్యాసభగవాను లుదాహరించియున్నవారు.

సూ. ఈక్షతేర్నాశబ్దమ్. ౧-౧-౫

శబ్దప్రమాణముచే సాధింపరానిది అశబ్దమనంబడును. అనగా ప్రధానము జగత్కారణము కాదు. శ్రుతియందీక్షతిశబ్ద ముండుటవలన నని సూత్రార్థము.

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ఛాందోగ్యము.

"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" ,,

ఇఁట సృష్టికి పూర్వమగు సత్పదార్థము బ్రహ్మమా? ప్రధానమా? అని సందేహము.

ప్రశ్న : ప్రధానము జగత్కారణమగుట పొసగునది. ఎట్లనగా?

"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్"

"రక్త శుక్ల కృష్ణవర్ణములతో రజః సత్త్వ తమో గుణములు కలదియు, నిత్యయు ఏకయు నగు ప్రకృతి - తనతో సమానములగు రూపగుణములు గల యనేక ప్రాణులను పుట్టించునది"

ఇట్లు శ్రుత్యంతరమున గానంబడుచున్నందున రజః సత్త్వ తమో రూపిణియగు సాంఖ్యప్రకృతియే జగత్కారణమని చెప్పవలెను. జీవా

త్మయు ప్రకృతి ననుసరించువాడగుటచే సచ్ఛబ్దవాచ్యు డగువాడు. ఇట్టి ప్రకృతికి రజోగుణము యొక్కయు సత్త్వగుణము యొక్కయు సంబంధమువలన క్రియాజ్ఞానశక్తుల సంయోగ మేర్పడుచున్నందున జగత్కారణత్వము సిద్ధించుచున్నయది. ప్రధానము అచేతన మగుటచే జగద్రూపముగా పరిణమించుట పొసగునది. పరమేశ్వరుఁడు - చేతనుఁడు కూటస్థుడు నగుటంజేసి జగదాకారముగా పరిణమించువాడు కాడు. పరిణామమనగా- కారణమునకు కలుగు వికారముగదా! ఇట్టి న్యాయము వలన శ్రుతిప్రమాణము వలనను ప్రధానమే సచ్ఛబ్దవాచ్యంబై జగత్కారణమగును కాదా?

**ఉత్తరము:** "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అను వాక్యమున "ఆబ్రహ్మము అనేకము నగుదునుగాత యని తలచెను." గల చేతనధర్మమగు బహుభవన సంకల్పము - అచేతనమగు ప్రకృతికి సంభవింపదుగదా! "బహ్వీం ప్రజాం" అను ప్రమాణము ననుసరించి సాంఖ్య ప్రకృతికి జగత్కారణత్వమును సాధింపరాదు. మున్ముందీ భాష్యమున "చమసవద విశేషాత్" అను సూత్రవివరణమునందు - మాయ (ప్రకృతి) పరమేశ్వరు నాశ్రయించియే బహుప్రజాజనయిత్రి యగునని నిరూపింపగలము గాన నిట విస్తరముగా చెప్పకుంటిమి.

మరియు రజఃసత్త్వరూపిణి యగుటచే క్రియాజ్ఞానశక్తి సంబంధము ప్రధానమునకు కలదని చెప్పుటయు సంగతముకాదు. సాంఖ్యమతమున ప్రకృతి - త్రిగుణాత్మిక యగుటచే తమోగుణమును విడదీసి రజఃసత్త్వ సంబంధమును చెప్పకూడదు. "తమస్సు క్షీణించినపుడు రజఃసత్త్వము లతిశయించుటచే ప్రధానమునకు క్రియా జ్ఞానసంబంధము పొసగు" నని చెప్పుటయు సరికాదు. సత్త్వరజస్తమో గుణముల మూడిటి సమానమైన స్థితి - ప్రకృతి యగునని సాంఖ్యులంగీకరించినవారు.

"కూటస్థుడగు పరమేశ్వరునకు జగదాకారముగా పరిణమించుట వికారహేతువగు" నని వక్కాణించుట - అజ్ఞానవిలసితము.

శివాద్వైత సిద్ధాంతమునందు పరమేశ్వరునకు సూక్ష్మము స్థూలము నను రెండు రూపములంగీకరింపఁబడినవి. సూక్ష్మమనగా - నామరూప విభాగముఁ జెందనిదియగును. స్థూలమనగా - నామరూపవిభాగముఁ జెందునది. ఇట్టి రూపద్వయము చిద్రూపిణి యచిద్రూపిణియునగు శక్తికి యేర్పడునట్టిది. శక్తితో నవినాభావసంబంధము కలిగియుండువాడగుటచే పరమేశ్వరుఁడు సూక్ష్మదశయందు కారణము స్థూలదశయందు కార్యము నగునని చెప్పునట్టి మా సిద్ధాంతమునందు "కారణముఁదగు వికారము కార్యము" అను న్యాయము ననుసరించిన లోపము సంభవింపదు గదా!

ప్రశ్న : ఓయీ ? "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ఇత్యాది వాక్యముతో సద్రూపమగు వస్తువు ఎట్టి విశేషము లేనిదని "ఏవ" అను నవధారణవలన తెలియుచున్నది. ఇట్టితటి బ్రహ్మము కారణమగునపుడు సూక్ష్మప్రపంచముతో కూడియుండుట యెట్లు పొసగును ?

ఉత్తరము : "సదేవ" అను నవధారణవలన విశేషము తొలగింపఁబడుటలేదు. మరియెద్దియనగా - "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతోవై సదజాయత" "సృష్టికి పూర్వము అసత్తుండెను. ఇట్టి యసత్తువలన సత్తు జనించెను" ఇట్లు శ్రుత్యేక దేశమునందు వినంబడు అసత్కారణత్వము భ్రాంతి మూలకమని తెలుపుటకు "సదేవ" అను నవధారణ యుపయోగింపఁబడినది. మరియు "సదేవ" అను వాక్యమునందు బ్రహ్మము నిర్విశేషమగుట యెట్లు పొసగును ? "ఆసీత్" "ఉండెను" అనుటవలన ఉండుట యను క్రియావిశేషము కలదని తెలియుచున్నది. "అగ్రే" "ముందు" అను కాలవిశేషంబు పొడకట్టుచున్నయది. "ఏకమేవ" అను నవధారణ వలన జగము నధిష్ఠించు వస్తువు రెండవది లేదని విశదమగునది. అద్వితీయ మనగా - రెండవ వస్తువు - తనకంటె వేరైనది - అవసరము లేకయే జగమున కుపాదానకారణమగునది యని యర్థము. ఇందువలననే బ్రహ్మము సర్వజ్ఞము అనంతశక్తి విశిష్టంబు నగుచున్నయది. ఇట్టి సర్వజ్ఞత్వ సర్వశక్తి

